ఓమ్

పరబ్రహ్మణేనమః

# ఉచ్ఛిష్టోపాసనమ్.

---

అయమ్



మచిలీ బందరు- ఆత్మూరి లక్ష్మీనృసింహ[illegible]

విరచితాంధ్ర తాత్పర్యసహితమ్.

తత్పుత్రానుమత్యా బందరు పురవాసినా

చల్లా నాగలింగశాస్త్రి పుత్రేణ

## లక్ష్మీనృసింహశాస్త్రిణా

మ[illegible]

[illegible]స్వదేశీ ముద్రాక్షరశాలాయాం

ముద్రితంచ ప్రకటీకృతమ్.

ద్వితీయముద్రణ- ౫౦౦ ప్రతులు.

1913 సం॥

---

రు 0—2—0

వెలమూల్యమ్

# పీఠిక.

---

వివాహ ప్రాతిహాక హోమానంతర మౌపాసన హోమమును ప్రారంభించి ఆహోమమును ప్రతిదినము సాయంప్రాతః కాలములయందు తండులములచే ద్విజులరందఱును చేయవలసిన విధియున్నను వివాహానంతరము భార్య బాల్యావస్థచే పుట్టినింటనేయుండి భర్తృగృహమునకు రానందుననున్ను భార్యవచ్చియున్నను మరికొన్ని యితర కారణములచేతనున్ను ఎల్లప్పుడు నవిచ్ఛిన్నముగ నౌపాసన హోమము జరగకున్నది. శుభాశుభకర్మలం జేయునప్పు డౌపాసనహోమమును ముందుగా జేసియే శుభాశుభములను ప్రారంభింపుచున్నారు. కనుక నౌపాసనహోమవిధానమున్ను అట్టియౌపాసన హోమమునకు విచ్ఛేదము సంభవించినయెడ దానికి ప్రాయశ్చిత్తముగా నేర్పడిన విచ్ఛిన్నౌపాసన విధానమున్ను వాటియర్థమున్ను తెలిసికొనుట యావశ్యకమైయున్నది.

ప్రతిదినము ఉపాసింపబడునది గనుక ఉపాసనమనగా అగ్ని. ఆయగ్నియందు చేయబడుకర్మ ఔపాసనమనబడును.

ఆయగ్నికి గృహ్యాగ్నియనిపేరు. ఆయగ్ని యెల్లప్పుడు గృహమందొక వేదికయందుంచి చల్లారకుండునటుల జాగ్రత చేయవలసినది. అట్లుచేయుచుండగా నేకారణముచేతనయిన ఆయగ్ని చల్లారినయెడ మథించిగాని శ్రోత్రియగృహమునుంచిగాని యగ్నిని తిరిగి సంపాదించి హోమము చేయవలసినది. ఆహోమము విచ్ఛిన్నౌపాసనమని పునస్సంధానమని రెండువిధములుగ వ్యవహరింపఁబడుచున్నది. విచ్ఛిన్నౌపాసనమనగా విచ్ఛిన్నమయిన యగ్నినిగూర్చి చేయఁబడు కర్మ. పునస్సంధానమనగా చల్లారిన యగ్నిని తిరిగి సంధానముచేయుకర్మ. విచ్ఛిన్నౌపాసనమున కంగముగా నౌపాసన హోమము చేయక ఒకటి రెండు హోమకాలము లతిక్రమించినయెడల సప్తహోతృహోమము చేయవలసినది. ఆహోమమంత్రమునకు సప్తహోతయని పేరుగనుక సప్తహోత్రహోమమనియాకర్మకు పేరుగలిగినది. ఔపాసనాగ్ని చల్లారినది మొదలుకొని తిరిగి విచ్ఛిన్నౌపాసనము చేయువఱకు మధ్యకాలమం దౌపాసన లోపముచే సంభవించెడి దోష నివృత్తికొరకీహోమము చేయఁబడుచున్నది.

ఈ గ్రంథమందు ముందుగా విచ్ఛిన్నాపాసనమున్ను పిమ్మట తదంగమగు సప్తహోతృహోమమున్ను తరువాత సాయంప్రాత రౌపాసన హోమమున్ను వ్రాయబడినది.

సులభముగా నర్థము జేసుకొనుటకు విచ్ఛిన్నాపాసనము ౨౯ వాక్యము లగాను సప్త హోతృ హోమము ౧౧ వాక్యములుగాను సాయం ప్రాత రౌపాసన హోమము ౨౮ వాక్యములుగాను విభజింపబడి తెనుగర్థముతో వ్రాయబడినది.

ఈ గ్రంథమందు ౧౩ మంత్రము లున్నవి. ఆ మంత్రములకు శ్రీ విద్యారణ్య భాష్యము ననుసరించి యర్థము వ్రాయబడినది. ఆ మంత్రములే వేదమం దెచ్చట నున్నవి ప్రతిమంత్రాంతమందును తెలియజేయబడినది.

---

# ప్రకటన

---

ఆత్మూరి లక్ష్మీనృసింహసోమయాజులుగారి పుత్రులు జగన్మోహనరావుగారు ఈ గ్రంథము ప్రకటన చెప్పవలసినదిగా మాకార్యస్థానముకు పంపినందున ఈ గ్రంథము ముద్రింపించి ప్రకటించుచున్నారము.

మచిలీపట్టణము |
బచ్చుపేట |

ఇట్లు
చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి.

## విచ్ఛిన్నోపాసన సూత్రమ్.

నిత్యో ధార్యోఽనుగతో మంథ్యశ్శ్రోత్రియాగారాద్వా హార్య ఉపవాసశ్చాన్యతరస్య భార్యాయాః పత్యుర్వాఽనుగతేఽపి వోత్తరయా జుహుయాన్నోపవసేత్ ॥ ఆప॥గృ॥ఖం ౫॥

(ఔపాసనాగ్ని) నిత్యమయినది. ధరింపదగినది. (ఆత్మయందారోపణ చేయదగినది) (ఆయగ్ని) చల్లారినయెడ మథింపదగినది. లేక వేదాధ్యయనసంపన్ను నియొక్క గృహమువలన దీసికొనిరాదగినది. భార్యకయినను భర్తకయినను (సాయం ప్రాతఃకాలములలో * నొక్కకాలమం దుపవాసము, లేక చల్లారినప్పుడు ఉత్తర మంత్రముచేత (అయాశ్చ అనుమంత్రి)ముచేత హోమము చేసినయెడ ఉపవాసము చేయనక్కరలేదు.

## శాట్యాయన సూత్రమ్.

---

చతుర్థీహోమాదుపర్యౌపాసనాగ్నా వనుగతేఽ యాశ్చేత్యాత్రి రాత్రాస్సోజ్యోతిర్జుషతామితి చాసప్తరాత్రాదత ఊర్ధ్వమాద్వాదశ రాత్రాత్త్రిస్తంతుమతీ స్తంతుంతన్వన్, ఉద్బుధ్యస్వాగ్నే, త్రయస్త్రింశత్తంతవ, ఇతిచ ప్రాణాయామశతం చావింశతి రాత్రాదుపవాసంచాత్రింశతిరాత్రాదతఊర్ధ్వమాషష్టిరాత్రాత్త్రిరాత్రముపవసేదతఊర్ధ్వ మాసంవత్సరాత్పౌనాపత్యంవిహితమతఊర్ధ్వంకాలబహుత్వే దోషగురుత్వమేనస్సు గురుషు గురూణి లఘుషు లఘూని శుచికరాణిభవంతి॥

వివాహశేషహోమము తరువాత ఔపాసనాగ్ని చల్లారితే మూడురోజుల పర్యంతము (హోమములేనియెడ) "అయాశ్చాగ్నే" అనుమంత్రముచేత (హోమము

---

* ప్రాతఃకాలమం దగ్ని చల్లారినయెడ సాయంకాలమువరకు నుపవాసము, సాయంకాలమున చల్లారినయెడ మరుచటిరోజు మధ్యాహ్నమువరకు నుపవాసము. ఆయుపవాసము దంపతులిద్దరును చేయవలసినదని కొందరిమతము; దంపతులలో నొక్కరుమాత్రమే చేయవలసినదని కొందరిమతము.

ము చేయవలసినది.) ఏడవరోజుపర్యంతము లేనియెడ "మనోజ్యోతిర్జుషతాం" అను మంత్రముచేత (హోమము చేయవలసినది.) అటుపిమ్మట పండ్రెండవరోజుపర్యంతము (లేనియెడ) మూడుతంతుమతీఋక్కులు అనఁగా "తంతుంతన్వన్ ఉద్బుధ్యస్వాగ్నే, త్రయస్త్రింశత్తంతవః" అను మూడుమంత్రములచేత హోమము చేయవలసినది.) ఇరువదవరోజుపర్యంతము (లేనియెడ) నూరుమార్లు ప్రాణాయామమున్ను తంతుమతీఋక్కులచే హోమమును చేయవలసినది. ) ముప్పదవరోజుపర్యంతము లేనియెడ ఉపవాసమున్ను తంతుమతీ ఋక్కులచే హోమమున్ను చేయవలసినది.

అటుపిమ్మట అరువదవరోజు పర్యంతము మూఁడురోజు లుపవాసము చేయవలసినది. అటుపిమ్మట సంవత్సరపర్యంతము ప్రాజాపత్య కృచ్ఛ్రము చెప్పఁబడినది. అటుపిమ్మట కాలవిస్తారము జరిగినయెడ దోషవిస్తారము దోషములు గొప్పవయిన యెడ ప్రాయశ్చిత్తములు గొప్పవగుచున్నవి. (దోషములు) స్వల్పములయిన యెడ (ప్రాయశ్చిత్తములు) స్వల్పములగుచున్నవి.

---

# విచ్ఛిన్నౌపాసనమ్.

దర్భేష్వాసీనోదర్భాం ధారయ మాణః పత్న్యా సహప్రా
ణానాయమ్య సంకల్పం కరోతి

ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ గోత్రః నామధేయోఽహం శ్రీమతః గోత్రస్య నామధేయస్య భగవత్ప్రీత్యర్థం * ఔపాసనాగ్నిమాధాస్యే విచ్ఛిన్నసంధానార్థం।

అర్థము స్పష్టము.

౨॥ శ్లో॥ ప్రాచీఃపూర్వాముదక్సంస్థం దక్షిణారంభమాలిఖేత్।
తథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్॥

(పరిశుద్ధమయిన భూమియందు పిండియుంచి దానిని పలకవలె నలుదిశలయందును సమముగాచేసి దానియందు రెండుదర్భలచేత) ముందుగా దక్షిణదిక్కునందారంభముగాను ఉత్తరదిక్కునందు సమాప్తిగాను తూర్పుకొనలుగల (మూడు రేఖలను) గీయునది. ఆప్రకారముగానే పడమరదిక్కునందారంభముగాను తూర్పుదిక్కునందు సమాప్తిగా నుత్తరపు కొనలుగల (మూడు రేఖలను గీయునది.

౩। అవోక్ష్యోఽభ్యుక్ష్య నిధాయవహ్ని ముత్సిచ్యతే ప్రో
క్షణతోయశేషమ్। ప్రాక్త్రయమన్యాం నిదధాత్యుదగ్వాయథాబహి
స్స్యాచ్చ పరిస్తరాణామ్॥

ఆరేఖలు గీచినస్థలమందు చోర్లింపబడిన హస్తముచే నుదకముజల్లి (దానియందు) అగ్నినుంచి మిగిలినయుదకమును వదిలివేయవలసినది. మరియొక యుదకపాత్రమును పరిస్తరణ దర్భలను వెలుపలగా తూర్పుభాగమందయిన నుత్తరభాగమందయిన నుంచవలసినది.

౪॥ భూర్భువస్సువరోమిత్యగ్నిం ప్రతిష్ఠాప్య భూర్భువస్సు
వరోమ్॥

అర్థము స్పష్టము.

---

* పరిస్తరణమనగా వహ్నికి నలుదిశలయందును వేయుదర్భలు.

* ఋ॥ చత్వారిశృంగాత్రయోఅస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య। త్రిధాబద్ధో వృషభోరోరవీతి మహోదేవో మర్త్యాగ్ం ఆవివేశ॥ (ఋ-౪-౫౮-౩. తై- ఆ ౧౦. ౧౧- ౩)

ఈ (అగ్నికి) నాలుగు (వేదములు) శృంగములు. మూడు (సవనములు) పాదములు. (ప్రాయణీయోదయనీయలు) రెండు శిరస్సులు. ఇతనికి (ఛందస్సులు) ఏడుహస్తములు. (ఫలమును) వర్షించెడి, అనఁగా (ఫలమును) ఇచ్చెడిఅగ్ని (మంత్ర బ్రాహ్మణ, కల్పములచే) మూఁడువిధములుగఁ గట్టఁబడినవాఁడగుచు ధ్వనిచేయుచున్నాడు. మహాత్ముఁడగు దేవుఁడు, అనఁగా నగ్ని మనుష్యులయందు ప్రవేశించుచున్నాఁడు.

౬॥ సప్తహస్తశ్చతుశ్శృంగ స్సప్తజిహ్వో ద్విశీర్షకః। త్రిపాత్ప్రసన్నవదన స్సుఖాసీన శ్శుచిస్మితః। స్వాహాంతు దక్షిణే పార్శ్వే దేవీంవామే స్వధాంతథా। బిభ్రద్దక్షిణహస్తైస్తు శక్తిమన్నం స్రుచం స్రువం। తోమరం వ్యజనం వామై ర్ఘృతపాత్రంతు ధారయన్॥

(అగ్ని) ఏడు చేతులు నాలుగుకొమ్ములు ఏడు జిహ్వలు రెండు శిరస్సులు మూఁడు పాదములు నిర్మలమయిన ముఖము! సుఖముగా కూర్చుండుటయు స్వచ్ఛమయిన చిరునవ్వును గలవాఁడు. దక్షిణభాగమందు స్వాహాదేవిని వామభాగమందు స్వధాదేవినిధరించుచున్నవాఁడు. దక్షిణహస్తముల (నాల్గింటిచేత) శక్తిని అన్నమును స్రుక్కును స్రువమును, వామహస్తముల (మూడింటిచేత) తోమరమును వాయుధమును వింజామరమును ఆజ్యపాత్రమును ధరించుచున్నవాఁడు.

౭॥ మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసం। ధూమధ్వజంలోహితాక్షం సప్తార్చిస్సర్వకామదం। ఆత్మాభిముఖ మాసీన మేవంధ్యాయేద్ధుతాశనమ్॥

మేషమునెక్కి గట్టబడిన జడలును పచ్చనికాంతియు అధికతేజస్సును

* ఈమంత్రమునకు నిరుక్తాదిగ్రంథములయం దనేకార్థములు వ్రాయఁబడినవి. వానిలో నగ్నిపరముగు నర్థమిచ్చుట వ్రాయఁబడినది.

ధూమమును చిహ్నమును ఎఱ్ఱనికన్నులును ఏడుజ్వాలలును గలిగి అన్నికోరికలనిచ్చువాడయి తనకభిముఖముగ కూర్చున్న యగ్ని నీప్రకారముగఁ దలంపుచున్నాను.

* ౮॥ ఏషహిదేవః ప్రదిశోఽను సర్వాః పూర్వోహిజాత స్సఉ గర్భేఅంతః। సవిజాయమాన స్సజనిష్యమాణ ప్రత్యఙ్ముఖా స్తిష్ఠతి విశ్వతోముఖః(తై-ఆ-౧. ౧౦-౩)

ప్రకాశమానుడయిన ఈ (అగ్ని) సమస్తమయిన దిక్కులను వ్యాపించి ముందుగాపుట్టినవాఁడు. ఆయగ్నియేగర్భమందున్నవాఁడు ఆయగ్నియే పుట్టుచున్న వాఁడు. ఆయగ్నియే పుట్టగలవాఁడు. అభిముఖుఁడు అన్నిదిశలయందు ముఖములుగల వాఁడుగాను నున్నాడు.

౯॥ ప్రాఙ్ముఖాగ్నే మమాభిముఖోభవ,సుముఖోభవ,సుప్రసన్నోభవ, వరదోభవ, యథోక్తజిహ్వయా హవిర్గృహాణ॥

౧౦॥ ఓంభూర్భువస్సువః॥

అర్ఘ్యము స్పష్టము.

౧౧॥ ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్॥ (ఋ-౩-౬-౨-౧౦-తై-సం౧-౫-౬.౪)

ఎవడు మాయొక్క కర్మలను ప్రేరణ జేయుచున్నాడో అట్టి జగత్స్రష్టయొక్క కోరదగిన తేజస్సును దలంపుచున్నారనుట

౧౨॥ పాదకేన పాణినా ప్రదక్షిణ మగ్నిం పరిసమూహ్య. అలంకృత్య అగ్నయేనమః। హుతవహాయనమః। హుతాశినేనమః। కృష్ణవర్త్మనేనమః। దేవముఖాయనమః। సప్తజిహ్వాయనమః। వైశ్వానరాయనమః। జాతవేదసేనమః॥

---

* ఈమంత్రమునకు పారాయణమందు శ్రీవిద్యారణ్యులవారు పరబ్రహ్మపరముగా నర్థము వ్రాసిరి. ఇచ్చట సందర్భము ననుసరించి యగ్నిపరముగ నర్థము వ్రాయఁబడినది.

ఉపరోమములగల హస్తముచేతఁ బ్రదక్షిణముగా నగ్నికి (చుట్టును) తుడిచి అలంకరించుట కేవలము స్పష్టము.

౧౩॥ ఇతిప్రాగాది ప్రదక్షిణ ముదకాదిభిరలంకృత్యాప్యుదిత్యు

ఉపరికారముగా, అనఁగా "అగ్నయేనమః" అనునది మొదలుగాఁగ ఋషిమొదివాక్యములచేతఁ బూర్వదిశ మొదలెనిమిది దిశలయందుఁ బ్రదక్షిణముగా పత్రలు మొదలగువాని చేత నలంకరించి॥

౧౪॥ ప్రాగుదగగ్రైర్దర్భైరగ్నింపరిస్తృణాతి। దక్షిణైరుత్తరైః। ప్రాగగ్రైఃపూర్వాపశ్చిమౌశ్చోదగగ్రైర్దక్షిణైరుత్తరైరుత్తరైరధరైశ్చ

ప్రాగగ్రములు నుత్తరాగ్రములునయిన దర్భలచేత నగ్నికి (చుట్టును) పరిస్తరణము చేయవలసినది. అనఁగా నగ్నికి నలుదిశలయందు దర్భలను బరచునది. దక్షిణమందు నుత్తరమందును దూర్పుకొనలుగలుగునట్టియు దూర్పునందును బడమర యందు నుత్తరపుకొనలు గలుగునట్టియు (దర్భలచేత) పరిస్తరణము చేయవలసినది. దక్షిణదర్భలను (తూర్పు, పడమరభాగములయందుంచిన దర్భలను) మీదుగాను ఉత్తరదర్భలను (తూర్పు పడమరలయందు వేసినదర్భల క్రిందుగాను నుంచవలసినది.

౧౫॥ ఉత్తరేణాగ్నిం ప్రాగగ్రాన్ దర్భాంత్సంస్తీర్య।

అగ్నికి నుత్తరభాగమందు దూర్పుకొనలుగల దర్భలను బరచునది.

౧౬॥ ద్వంద్వన్యంచి పాత్రాణి ప్రయునక్తి, * దర్వ్యాజ్యస్థాల్యౌ, ప్రోక్షణీపవిత్రే, చత్వారిపాత్రాణి ప్రయుంజ్యాత్।

(ఆ పరచినదర్భలయందు) పాత్రములను ద్వంద్వముగా బోరగించవలసినది. దర్వి, ఆజ్యస్థాలి, ప్రోక్షణి, పవిత్రము, అనెడి నాలుగుపాత్రములను నుంచవలసినది.

౧౭॥ సమౌ సాగ్రౌ ద్వౌదర్భౌ ప్రాదేశమాత్రౌ పవిత్రే కృత్వా తృణంకాష్ఠంవాంతర్ధాయ ఛినత్తి న నఖేన, అపఉపస్పృశ్య, మూలాత్ప్రభృత్యగ్రా దద్భిరనుమృజ్య ప్రోక్షణీం ధాన్యాం ప్రాగగ్రే నిధాయాప ఆసిచ్య ప్రాచీస్త్రిరుత్తానాభ్యాం పాణిభ్యా మంగుష్ఠోపకనిష్ఠికాభ్యా ముదగగ్రే గృహీత్వోత్పూయ॥

సమములును కొనలుగలవియు ప్రాదేశ పరిమాణముల నగు రెండుదర్భలను పవిత్రములుగాఁజేసి (ఆపవిత్రముయొక్క మొదళ్ళను) (మఱియొక)దర్భచేతను పుడకనయినను వ్యవధిగానుంచుకొని కోయవలసినది. గోళ్ళచేత గోయఁగూడదు. ఉదకమును స్పృశించి (ఆపవిత్రమును) మొదటినుండి చివరదాక నుదకముచేఁదుడిచి ప్రోక్షణీపాత్రియందుఁ బ్రాగగ్రముగానుంచి యాప్రోక్షణీపాత్రయం దుదకమునుంచి యుత్తానములయిన హస్తములయొక్క యంగుష్ఠానామికలచేత (ఆపవిత్రమును) నుత్తరాగ్రముగా పట్టుకుని (ఆపవిత్రముచేత ఆయుదకమును) తూర్పుగా మూఁడుమార్లు పరిశుద్ధిఁ జేయవలసినది.

౧౫॥ సపవిత్రేణ పాణినా పాత్రాణిసంమృశ్య, పాత్రాణ్యుదక్ప్రవణముత్తానాని కృత్వా, త్రిః ప్రోక్ష్య పాత్రాణి, తత్పాత్రం విసృజ్య॥

పవిత్రముతోఁగూడిన హస్తముచే పాత్రములను స్పృశించి, యుత్తరముఖములుగలుగునట్లెత్తి మూఁడుమార్లు ప్రోక్షించి యాప్రోక్షణీపాత్రమును వదలివేయవలసినది.

౧౬॥ ఆజ్యంవిలాప్య. అపరేణాగ్నింపవిత్రాంతర్హితాయా మాజ్యస్థాల్యా మాజ్యం నిరూప్య, ఉదీచోఽంగారాన్నిరూహ్య, తేష్వధిశ్రిత్య, జ్వలతా దర్భేణావద్యోత్య, ద్వేదర్భాగ్రే (తృణమంతర్ధాయ) ప్రచ్ఛిద్య, అపఉపస్పృశ్య, ప్రక్షాళ్య, దర్భాగ్రే తస్మిన్నాజ్యే ప్రాస్య, పునరపఉపస్పృశ్య, త్రిః పర్యగ్నికృత్వా, ఉదగుద్వాస్య వర్త్మ కుర్వన్ అంగారాన్ప్రత్యూహ్య॥

ఆజ్యమును గాచి యగ్నికి బడమరభాగమున బవిత్రముతోఁగూడిన యా ఆజ్యపాత్రయందాజ్యమునుంచి యుత్తరమందున్న యంగారములను (అగ్నిలోనుంచి) విడదీసి యాయంగారములయందు (ఆజ్యపాత్రమును) నుంచి జ్వలింపుచున్న దర్భ

---

• దర్వియనఁగా హోమముచేసెడి పాత్రము. ఆజ్యస్థాలి యనఁగా నాజ్యమునుంచెడి పాత్రము. స్రువమనఁగా నాజ్యపాత్రములోనుంచి హోమపాత్రమందా జ్యముయుంచెడి పాత్రము.

(ఆజ్యమందు) తలక్రిందుగాఁ బ్రకాశింపఁజేసి రెండుదర్భాగ్రములను (ప్రతియొక) దక్షిణ వ్యవధానముగా నుంచుకొని తోసి ఉదకము స్పృశించి దర్భాగ్రములను కడిగి ఆయాజ్యమందుంచి తిరిగి ఉదకమును స్పృశించి (జ్వలించుచున్న దర్భచే) ఆజ్యమునకు ముమ్మారు పర్యగ్నికరణముచేసి అనఁగా చుట్టుత్రిప్పి (ఆజ్యపాత్రము నకు (అగ్నికి) ఉత్తరభాగమున మార్గము చేయుచుదింపి, అంగారములను తిరిగియగ్ని లోనికి ద్రోయవలసినది.

౨౦॥ ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరాహార మాజ్యం త్రిరుత్పునాతి, ప్రాగారభ్య పశ్చాన్నీత్వా ప్రాగేవ సమాప్తిః॥

ఉత్తరాగ్రములయిన పవిత్రముచేత తియగా ఆజ్యము ముమ్మారు ఉత్తరభాగమందు పరిశుద్ధిఁజేయవలసినది. తూర్పువైపున ప్రారంభించి పడమర వైపునకుఁ దీసికొనివచ్చి తూర్పువైపుననే సమాప్తి (చేయవలసినది.)

౨౧॥ పవిత్రగ్రంథిం విస్రస్య ప్రక్షాళ్య ప్రాగగ్రమగ్నౌ పవిత్రే అనుప్రహరతి॥

పవిత్రపు ముడివిప్పి కడిగి పవిత్రదర్భల నగ్నియందు ప్రాగగ్రముగా నుంచవలసినది.

౨౨॥ స్రుక్స్రువావగ్నౌ ప్రతితప్య. త్రిభిః దర్భాగ్రైస్సం మృజ్య, పునః ప్రతితప్య, ప్రోక్ష్య, నిధాయ, దర్భానద్భిస్సగ్ స్పృశ్యాగ్నౌ ప్రాగగ్రాన్ప్రహరతి॥

స్రుక్కును స్రువమును నగ్నియందుఁ గాచి మూఁడు దర్భాగ్రములచే ముందు స్రుక్కు తర్వాత స్రువము దుడిచి మరల గాచి (ఉదకముచే) ప్రోక్షించి (ఆజ్యపాత్రమున కుత్తరభాగమందు స్రుక్కును దానికి ఉత్తరమందు స్రువమును ఉంచి (తడిచిన) దర్భల నుదకముచే కడిగి అగ్నియందు ప్రాగగ్రములనుగా నుంచవలసినది

౨౩॥ అదితేఽనుమన్యస్వ, అనుమతేఽనుమన్యస్వ, సరస్వతేఽను మన్యస్వ, దేవసవితః ప్రసువ॥

అదితి దేవీ (నాచే చేయబడుచున్న కర్మను) అంగీకరింపుము. ఓ అనుమతి దేవతా అంగీకరింపుము. ఓ సరస్వతీ అంగీకరింపుము ప్రేరకుడవగు పరమాత్మా ప్రేరణచేయుము.

౨౮॥ ఏకం, ద్వే, త్రీణి, చత్వారి, ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయఇదం నమమ॥

(సుప్రసిద్ధమైన సూక్తమందు) "ఏకం, ద్వే, త్రీణి, చత్వారి." (అను నాలుగు వాక్యముల చేత నాలుగుమారులాజ్యమునుంచి) "ఓంభూర్భువస్సువస్స్వాహా" (ఈమంత్రముచే నగ్నియందు హోమము జేయవలసినది) ఈ (హోమ హవిస్సు) ప్రజాపతికొఱకు (నాదుకాదు.)

౨౯॥ ఏకం, ద్వే, త్రీణి, చత్వారి। అయాశ్చాగ్నేఽస్యనభిశస్తిశ్చసత్యమిత్త్వమయాఅసి। అయసామనసా ధృతోఽయసా హవ్యమూహిషేఽయానోధేహి భేషజగ్ం స్వాహా। అయసేఽగ్నయ ఇదంనమమ॥ (తై-ఏకాగ్ని కాండ-౧-౫)

ఓ యగ్ని నీవు (భక్తులను) పొందదగినవాడవును దోషరహితుడవును సత్యస్వరూపుడవును (సర్వజనులను) బొందదగినవాడవును అగుచున్నావు. (మాచేత) (నిన్ను) పొందినమనస్సుచే ధరింపబడితివి. (మమ్ము) పొందిన (నీమనస్సుచేత) హవిస్సును (దేవతలకు) బొందింపుము. (మాచే) బొందబడినవాడవగుచు మాకొఱకు భయజయమును అనగా భయనివారణమునకలుగజేయుము.

౩౦॥ నానాప్రకారేణ సంభావిత సకలదోష నిర్హరణార్థం సర్వప్రాయశ్చిత్తం కరిష్యే॥

నానా విధములచేత సంభవించిన సమస్తదోష పరిహారముకొఱకు సర్వప్రాయశ్చిత్తహోమము జేయగలను.

౩౧ ఓంభూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయఇదం నమమ॥
అర్థముస్పష్టము.

౩౨॥ అదితేఽన్వమగ్ంస్థాః। అనుమతేఽన్వమగ్ంస్థాః। సరస్వతేఽన్వమగ్ంస్థాః॥ దేవసవితః ప్రాసావీః॥

ఓ. యదితిదేవీ (నాచే జేయఁబడినకర్మను) అంగీకరించితివి. ఓ ప్రాణ్ణమానీ దేవతాఅంగీకరించితివి, ఓ.సరస్వతీఅంగీకరించితివి, ప్రేరకుఁడవగు పరమాత్మా ప్రేరణ జేసితివి.

౨౯॥ అనేన విచ్ఛిన్నోపాసన హోమేనభగవాం త్సర్వాత్మక స్సర్వం శ్రీయజ్ఞేశ్వర స్సుప్రీణాతు॥ యజ్ఞేశ్వరార్పణమస్తు॥

ఈ విచ్ఛిన్నోపాసన హోమముచేత భగవంతుఁడును సర్వస్వరూపుఁడును అగు యజ్ఞేశ్వరుఁడు సమస్త (కర్మముకూర్చి) లెస్సగా తృప్తినొందుగాక.

అధీతవేదస్య గృహోద్గృహీత్వా నిధాయవహ్నిం విధినాన మింధ । ఆజ్యంతు సంస్కృత్య సకృద్గృహీత్వా పరిశ్రితేన్నా జుహుయాదయాశ్చ॥

అయాశ్చహోమమునకు సకృద్గ్రహణము.

విచ్ఛిన్నోపాసనం సమాప్తమ్.

అథ సప్తహోతృహోమః.

౧॥ పునః ప్రాణానాయమ్య, మమోపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం, అనేకోపాసనాంతరిత లోపప్రాయశ్చిత్తార్థం * సప్తహోతారం హోష్యామి॥

అనేకమగు నాపాసనహోమములయొక్క అభావముచే (సంభవించిన) లోపమునకు ప్రాయశ్చిత్తనిమిత్తము సప్తహోతృమంత్రముచే హోమము చేయుచున్నాను.

౨॥ అదితేఽనుమన్యస్వ। అనుమతేఽనుమన్యస్వ। సరస్వతేఽనుమన్యస్వ! దేవసవితః ప్రసువ।

లోఁగడ ౨౩ సంఖ్యయందుకు అర్థము చూడుఁడు.

3॥ ఏకం, ద్వే, త్రీణి, చత్వారి॥

---

* ఈమంత్రమందు హోత అధ్వర్యుఁడు మొదలగు ఏడుగురు హోతలు (హోమనిష్పాదకులు) ఉండుటవలన నీమంత్రమునకు సప్తహోతయని పేరు ఈమంత్రముచే హోమము చేయుటవలన నీకర్మకు సప్తహోతృ హోమమని పేరు,

"ఏకం, ద్వే, త్రీణి, చత్వారి," (ఈ నాలుగు వాక్యములచేత నాలుగుమార్లు స్రువముచే సుక్కు యందాజ్యమునుంచి హోమము జేయవలసినది.

౪॥ బ్రహ్మాహవిర్హోతా। సత్యహవిరధ్వర్యుః। అచ్యుతపాజా అగ్నీత్। అచ్యుతమనా ఉపవక్తా। అనాధృష్యశ్చా ప్రతిధృష్యశ్చ యజ్ఞస్యాభిగరౌ। అయాస్య ఉద్గాతా॥

ఈ యజ్ఞమందుండు (ఋత్విక్కులలో) హోత, బ్రహ్మహవి యను ఋషిస్వరూపుడు. అధ్వర్యుడు సత్యహవియను ఋషి స్వరూపుడు. అగ్నీధ్రుడు అచ్యుతపాజుడను ఋషిస్వరూపుడు. బ్రహ్మ అచ్యుతమనుడను ఋషి స్వరూపుడు. యజ్ఞమునకు అభిగరులు (ప్రస్తోతృ, ప్రతిహర్తలు) అనాధృష్యుడు అప్రతిధృష్యుడు అను ఋషిస్వరూపులు ఉద్గాత అయాస్యుడను ఋషిస్వరూపుడు.

౫॥ వాచస్పతే హృద్విధేనామన్। విధేమ తేనామ। విధేస్త్వమస్మాకంనామ। వాచస్పతిస్సోమమపాత్। మాస్మాకం తంతుశ్ఛేదిమా మనుష్యాః। నమోదివే। నమః పృథివ్యై స్వాహా॥ (చిత్తి ౫ అనువాకము.)

హృదయమేరిగడవును, (అందరిచే) నమస్కారము పొందువాడవు నగు ఓ వాచస్పతీ నీకు నమస్కారము చేయుచున్నాము. మాయొక్క నామమును నీవు (దేవతలతో) చెప్పుము. వాచస్పతి (మాయజ్ఞమందు సోమపానము) జేసెను. (అందువలన) (మాగృహమందు) దేవసముదాయమున్ను మనుష్యసముదాయమున్ను విచ్ఛేదమును పొందకపోగాక. ద్యులోకమునకు నమస్కారము. పృథివికి నమస్కారము (అని) వాక్కు పలుకుచున్నది.

౬॥ వాచస్పతయే బ్రహ్మణఇదంనమమ॥

వాక్పతిఅయిన బ్రహ్మకొఱకు. ఈ (హోమము) నాకు కాదు.

౭॥ నానా ప్రకారేణ సంభావితసకలదోషనిర్హరణార్థం సర్వప్రాయశ్చిత్తం కరిష్యే॥

౯॥ ఓం భూర్భువస్సువస్స్వాహా॥ ప్రజాపతయ ఇదం నమమ॥

౧౦॥ అదితేఽన్వమగ్గ్‌స్థా॥ అనుమతేఽన్వమగ్గ్‌స్థా॥ సరస్వతేఽన్వమగ్గ్‌స్థా॥ దేవసవితఃప్రాసావీః॥

పూర్వమందు అర్థము వ్రాయబడినది.

౧౦॥ అనేన సప్తహోత్రహోమేన భగవాం త్సర్వాత్మక స్సర్వం శ్రీయజ్ఞేశ్వర స్సుప్రీణాతు॥

౧౧॥ యజ్ఞేశ్వరార్పణమస్తు॥

ఈసప్తహోత్ర హోమముచేత భగవంతుడును సర్వాత్మకుడును యజ్ఞేశ్వరుడు లెస్సగా తృప్తినొందుగాక.

సప్తహోత్రహోమము సమాప్తము.

ప్రాతస్సాయమౌపాసన హోమః.

౧॥ మమోపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం (ప్రాతరౌపాసనం) సాయమౌపాసన హోమం తంత్రేణ హోష్యామి॥

౨॥ భూర్భువస్సువరోమ్॥

అర్థము స్పష్టము. ఈహోమము ప్రాతఃకాలమందును సాయంకాలమందును విధ్యుక్తముగా చేయవలసినది. ఈహోమములు సర్వదుల చేత హూర్వహోమముగా చేయవలయును.

3॥ చత్వారి శృఙ్గాత్రయోఅస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాసోఅస్య। త్రిధాబద్ధో వృషభోరోరవీతి మహోదేవో మర్త్యాగం అవివేశ॥

ఈ మంత్రార్థము విధ్యపాసనమందు వ్రాయబడినది,

౪॥ సప్త హస్తశ్చతుశ్శృంగ స్సప్త జిహ్వో ద్విశీర్షకః। త్రి పాత్ప్రసన్న వదన స్సుఖాసీనశ్శుచిస్మితః। స్వాహాంతు దక్షిణే పార్శ్వే దేవీంవామే స్వధాంతథా। బిభ్రద్దక్షిణహస్తైస్తు శక్తిమన్నం స్రుచం స్రువం। తోమరం వ్యజనం వామై ర్ఘృతపాత్రంతు ధారయన్॥

౫॥ మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసం। ధూమ ధ్వజం లోహితాక్షం సప్తార్చిస్సర్వకామదం। ఆత్మాభిముఖ మాసీన మేవంధ్యాయే ద్ధుతాశనమ్॥

౬॥ ఏషహిదేవః ప్రదిశోఽనుసర్వాః పూర్వోహిజాత స్సఉ గర్భేఅంతః సవిజాయమాన స్సజనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతోముఖః॥

౭॥ ప్రాఙ్ముఖాగ్నే మమాభిముఖోభవ, సుముఖోభవ, సుప్ర సన్నోభవ, వరదోభవ, యథోక్తజిహ్వయా హవిర్గృహాణ॥

౮॥ ఓంభూర్భువస్సువః॥ ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గోదే వస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్॥

౯॥ సోదకేన పాణినా ప్రదక్షిణమగ్నిం పరిసమూహ్య, అలం కృత్య॥

౧౦॥ అగ్నయేనమః। హుతవహాయనమః। హుతాశినేనమః। కృష్ణవర్త్మనేనమః। దేవముఖాయనమః। సప్తజిహ్వాయనమః। వైశ్వా నరాయనమః। జాతవేదసేనమః॥

౧౧॥ అదితేఽనుమన్యస్వ। అనుమతేఽనుమన్యస్వ। సరస్వ తేఽనుమన్యస్వ। దేవసవితః ప్రసువ॥

౧౨॥ ఓం సూర్యాయస్వాహా। సూర్యాయేదంనమమ। అగ్న యేస్విష్టకృతేస్వాహా। అగ్నయే స్విష్టకృతఇదంనమమ॥ ఇతిప్రాతః॥

మమ్ము తెలిసికొమ్ము (మా) ఆహ్వానమును వినుము. పాపాత్ములగు అందరివలన మమ్ము రక్షింపుము.

౧౯॥ హోమసాద్గుణ్యార్థ మనాజ్ఞాతత్రయ మంత్రజపం కరిష్యే॥

హోమసిద్ధినిమిత్తము "అనాజ్ఞాతం" అనునది మొదలుగాగల మూడు మంత్రములను జపించుచున్నాను.

౨౦॥ అనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్య క్రియతే మిథు। అగ్నే తదస్య కల్పయ త్వగ్ంహి వేత్థ యథాతథం॥ (తై.బ్రా. ౩.౭.౧౧.౫)

ఓ అగ్నీ నీవు (యజ్ఞముయొక్క) యథార్థము దెలిసినవాడవు గనుక (మాచేత) దెలియబడనట్టియు తెలియబడినట్టియు యజ్ఞముయొక్క యేభాగము లోపింపజేయబడెనో ఆయజ్ఞముయొక్క లోపింపబడిన భాగమును పూర్తి జేయుము.

౨౧॥ పురుషసంమితో యజ్ఞో యజ్ఞః పురుషసంమితః। అగ్నే తదస్య కల్పయ త్వగ్ంహి వేత్థ యథాతథం॥ (తై.బ్రా. ౩.౭.౧౧.౫)

యజ్ఞము పురుషునితో సమానమయినది (పురుషునివలె అవయవలోపము లేనిది) యజ్ఞము పురుషునిచే జేయబడుచున్నది. ఓయగ్నీ నీవు యజ్ఞముయొక్క యథార్థము దెలిసినవాడవు గనుక ఆయజ్ఞముయొక్క (అవయవలోపమును) పూర్తి జేయుము.

౨౨॥ యత్పాకత్రా మనసా దీనదక్షా న యజ్ఞస్య మన్వతే మర్తాసః। అగ్నిష్టద్ధోతా క్రతువిద్విజానన్ యజిష్ఠో దేవాగ్ం ఋతుశో యజాతి॥ (తై-బ్రా-౩-౭-౧౧-౬)

బాలురవలె రక్షింపబడదగినట్టియు అసమర్థులయినట్టియు। మనుష్యులు యజ్ఞముయొక్క యే (భాగమును) మనస్సుచేత తెలిసికొనరో ఆ తెలియని భాగమునుగూర్చి యజ్ఞవేత్త, విశేషజ్ఞానవంతుడు, యాగసమర్థుడు (దేవతల ఆహ్వానము చేయువాడును అగు అగ్ని, కాలములయందు దేవతలను పూజింపుగాక.

౨౩ అనేన ప్రాతరౌపాసనహోమేన సాయమౌపాసనహోమేన భగవాంత్సర్వాత్మకస్సర్వం శ్రీయజ్ఞేశ్వరస్సుప్రీణాతు। యజ్ఞేశ్వరార్పణమస్తు॥

ఈ ప్రాతరౌపాసన హోమముచేతను సాయమౌపాసనహోమము చేతను భగవంతుడును సర్వస్వరూపుడును అగు యజ్ఞేశ్వరుడు తృప్తినొందుగాక.

౨౪॥ స్వస్తిం శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలమాయుష్యం తేజ ఆరోగ్యం దేహి మే హవ్యవాహన। శ్రియం దేహి మే హవ్యవాహన ఓం నమ ఇతి॥

ఓ యగ్ని (యాగ) క్షేమమును ఆస్తిక్యమును ధారణసామర్థ్యమును కీర్తిని ప్రజ్ఞను విద్యను బుద్ధిని సంపదను బలమును ఆయుష్షును తేజస్సును ఆరోగ్యమును ఇమ్ము. ఓ యగ్ని సంపదను నాకొసగుము. ఓ యగ్ని నమస్కారము

౨౫॥ యస్య స్మృత్యా చ నామోక్త్యా తపో హోమక్రియాదిషు। న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతమ్॥

ఏ విష్ణువుయొక్క స్మరణచేతనున్నూ నామోచ్చారణముచేతనున్నూ తపస్సు హోమము మొదలగు క్రియలయందు లోపభాగము సంపూర్తినొందునో అట్టివిష్ణువును నిప్పుడు నమస్కరించుచున్నాను.

౨౬॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన యద్ధుతంతు మయాదేవ పరిపూర్ణం తదస్తు తే॥

ఓ యగ్ని మంత్రలోపముగాను క్రియాలోపముగాను భక్తిలోపముగాను ఏహోమము నాచేత చేయబడినదో ఆ లోపము నీవు పూర్తియగుగాక.

౨౭॥ చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవతు • అహంభో అభివాదయే॥

స్పష్టము.

ఔపాసనహోమము సమాప్తము.

ఈగురుతు తనవారి యజమానునియొక్క ప్రవర చెప్పవలసినది.

# ప్రకటన

| | | |
|---|---|---|
| 1 | యాజుషస్మార్తమంత్రపాఠము సస్వరము- ప్రథమభాగము | 1I రు 1-8-0 |
| 2 | యాజుషస్మార్తమంత్రపాఠము-సస్వరము-ద్వితీయభాగము | 1-8-0 |
| 3 | యాజుషస్మార్తానుక్రమణిక-ఇందుపంచదశకర్మలు. స్వప్రయోగములు నుండును. | 1-8-0 |
| 4 | యాజుషాపరప్రయోగానుక్రమణిక-ఇది బ్రాహ్మణాపరము-ద్వాదశాహస్సులుండును | 1-0-0 |
| 5 | వటుప్రశ్ని-సస్వరము-దీనికే అష్టావాక్యజపమందురు | 0-2-0 |
| 6 | మహాన్యాసము-సస్వరము-ఇందు బహువిషయము లుండును | 0-6-0 |
| 7 | పంచోపనిషత్తులు-సస్వరము-ఇందు చిత్తి- శిక్ష-ఆనందవల్లి-భృగువల్లి నారాయణము ఇందుకే అశ్వమేధమునుకూడ ముద్రింపించితిమి | 0-8-0 |
| 8 | మంత్రప్రశ్నములు రెండును సస్వరముగ నుండును | 0-4-0 |
| 9 | అభిశ్రవణము-ఇందు అన్నసూక్తమును-నాచికేతాంతమునకు అభిశ్రవణమును సస్వరముగ నుండును. ప్రతి 1 కి | 0-4-0 |
| 10 | సంధ్యావందనము-సస్వరము | 0-2-0 |
| 11 | హనుమద్వ్రతము తాత్పర్యసహితము | 0-2-0 |
| 12 | ఆశౌచనిర్ణయదర్పణము- తాత్పర్యసహితము ప్రతి 1 కి | 0-4-0 |
| 13 | బ్రహ్మయజ్ఞము-సస్వరము | 0-2-0 |
| 14 | వ్రతరత్నమహోదధి- ఇందు బహువ్రతములుండును తాత్పర్యసహితము | 2-8-0 |
| 15 | క్షీరాబ్ధివ్రతము | 0-1-0 |
| 16 | అశ్వత్థ నారాయణ వ్రతకల్పము | 0-2-6 |
| 17 | అనంతవ్రతకల్పము | 0-2-0 |
| 18 | యజుర్వేదాబ్దికమంత్రదర్పణము | 0-4-0 |
| 19 | యజుర్వేద వివాహప్రయోగము | 0-8-0 |
| 20 | యజుర్వేద ఉపనయనప్రయోగము | 0-8-0 |

మచిలీపట్టణము
బచ్చుపేట

ఇట్లు
చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి

